శ్రీ గురుబ్రహ్మణేనమః

# ఉమామహేశ్వర శ[illegible].

---


గ్రంథకర్త,

అంగారు అప్పలస్వామి,

సంతబొమ్మాళి, టెక్కలి తా॥


---


ప్రకాశకులు

మార్పు నరసన్న, సనపల రామమూర్తి.

500 ప్రతులు.

శ్రీ రామకృష్ణా ముద్రణాలయము,
శ్రీకాకుళం.
1942.






[వెల 0—4—0.

# ఆశీస్సు

శ్రీయుతుడు మార్పు నరసన్న । శేముషీధు
రంధరుడు, చెలి, ననపల । రామమూర్తి
ఇర్వురును దీనినచ్చువే । యీ చినాకు
విభుడు సిరులిచ్చి వారిదీ । వించుగాత!

# తొలిపలుకు.

---

నేనీచిన్న గ్రంధమును సాంతము శ్రద్ధతో జదివితిని. ఆంధ్ర భాషయందిప్పటికి వాడుకలోనున్న శతకములవలె నిదియు పద్య మకుటమునను సరించి యుమామహేశ్వర శతకమని పేరుగాంచినది.

గ్రంధకర్త సంతబొమ్మాళి గ్రామవాస్తవ్యుడగు అంగూరు అప్పలస్వామి. ఈతడాంధ్రభాషయందు చక్కని సాహిత్యము కలవాడు. గురుముఖమున బ్రహ్మవిద్యనభ్యసించినవాడు. కేవలాద్వైతభావుడు. నిరాడంబరుడు. తనదోషములనైనను కొంచెమేనియు దాచక ప్రభుసన్నిధానమున నున్నవియున్నట్లు విన్నవించు స్వభావముగల పరమభక్తుడు. భావములు శ్లాఘనీయములు. భక్తిరసపూరిత నిర్మలహృదయమునుండి వెలువడుటచే నవి యాత్మానుభవములై, భక్తజనమనోరంజకములై, అద్వైతసిద్ధాంతసమర్థనీయములై, శాస్త్రసమ్మతములై, సంక్లుప్తములై కడుంగడు వలరారుచున్నవి.

ఈతనికవిత్వము సరళము. సులభము. శైలి మృదుమధురము, వృద్ధసాంప్రదాయబద్ధము. పద్యములు ధారాకలితములు. కూర్పమి యనుపమానము. పద్యములు శ్రావ్యములు. హృద్యములు.

గ్రంధకర్త యీశతకమేగాక లంబోదరీయము, సరసపద్యముక్తావళి, శివప్రబోధ మొదలగు గ్రంధములు రచించినట్లును అవియముద్రితములైయున్నట్లును తెలియుచున్నది.

ఈతనికృతులాంధ్రదేశమున నాచంద్రార్కము వెలయుగాత! పరమేశ్వరుడీతని నాశీర్వదించుగాత!

ఇట్లు,

కోటబొమ్మాళి
18—1—42

ఆంధ్రభాషాసేవకుడు,
కొండివర్తి సూర్యనారాయణశర్మ.



ఓం

గురుభ్యో నమః

# శ్రీ ఉమామహేశ్వర శతకము.

సీ॥ శ్రీ సాంబశివభవా!| శితికంఠకల్యాణ!
వరదా! జగద్రూప | వరకలాప!
గంగాధరా! భవ | భంగా! మహాదేవ!
శంభూ! జగన్నేత! | సత్యచరిత!
మంగళాకర! జగ | న్మండిత! పరిపూర్ణ!
శర్వా! సుధీలోల! | సాధుపాల!
గౌరీధవా! మోక్ష | కర! పరమేశ్వరా!
భర్గా! మహోహార! | పరమచతుర!

తే॥ సచ్చిదానంద! నతమహా | చార్యబృంద!
సరస కరుణాకటాక్ష! దు | ష్టశిక్ష!
కంజహితభాన! తిర్లంగి | గ్రామవాస!
మహిత జగదీశ! గిరిశ! యు | మామహేశ!

పరమేశ్వరా! యిదే । భావింప మనసార
మ్రొక్కెదు మతిమతి । మోదమలరఁ
గనికరించుము భక్త । కల్పవనీ జాత!
భవనాశ! గౌరీశ! । పాహిపాహి
దాసుండ దీనుఁడ । దైవరాయా! సదా
కారుణ్యబుద్ధి మ । క్కువిరనిగమ
పారంబుచేసి నం । పారంబుఁబోఁద్రోసి
శతకమాచంద్రార్క । నరిణేఁజూచి
భవదమాయికరూప మ । వ్వారిఁజూపు
మెఱిఁగితిని నీదుసేవలిం । కేల విడుతు ॥కం౨॥ 2

ఏనౌక్క హీనుఁడ । నేమైన జడియు న
దేమంటివా మున్న । దే మిఁ నిన్నుఁ
దెలియకపలుగాకి । పలెఁ బరించితినిప్పు
డెఱిఁగితిఁబెద్దల । నఱఁగినిలిచి
చెప్పినారంతయు । శ్రీవారిమహిమను
సిగ్గుజనించె నా । చింతదొరఁగె
మోహంబునడలెను । త్సాహంబుసంధిల్లె
బాడెదనిఁకనిన్ను । పారముగను
భవమహావార్ధిఁదరియింతు । భద్రిమమ్యొ
పులదోసియుఁ పూర్వఁపు । మాయనావుడు ॥కం౩॥ 3

అభవ! భవన్మాయ । యతిఘోరమతిదుస
రంబుగదా! యెంత । ప్రాజ్ఞునకును
మూలంబుదెలియదు । ముమ్మూర్తి జగముల
సృష్టించితేరలప్పైఁ । జిత్రములుగ
లాడించిజీవుల । కంతంబుగనరాని
భవసాగరంబునఁ । బారవైచు
నంతటిసాహసం । బెత్తిగినవారి
శివవహ్నిగాదె యీ । విషయవాంఛ
చిక్కితినీ దాన నిఁకనైనఁ । జేరఁదీసి
భవముఁబోఁజిమ్ము శాశ్వత । పదమునిమ్ము ॥కం॥  4

ఎదికన్న నీరూప । మేయాట నెదిముట్ట
హర! నీదుపాదమే । యగుచునుంట
ఎదియన్న నీకథ । యేయాట నెదివ్రాయ
నభవ! నీచరితమే । యగుచునుంట
ఎదివిన్న నీనామ । మేయాట నెదిత్రావ
నధిప! నీతీర్థమే । యగుచునుంట
ఎదితిన్న నీయెంగి । లేయాట నెదిసేయ
నార్య! నీసేవయే । యగుచునుంటఁ
గలుగఁజేయుము గలుషంబుఁ । దొలఁగఁద్రోయు
మలరఁజేయుము సంతోష । మప్రమేయ! ॥కం॥  5

కరుణాపారఁగ నుఁగొని । వెడవెడరక్షించు
పసిబిడ్డడను భక్త । పారిజాత!
చదివించి గురువిద్య । సాధింపఁజూపిన
ప్రియశిష్యుఁడను సుధా । మయశరీర!
సద్గోష్ఠి సత్యవి । చారంబు నొసఁగిన
దాసానుదాసుఁడ । ధనదమిత్ర!
యానందమాయువు । నైశ్వర్యమిడి ప్రోచు
శ్రీవారివాఁడను । శ్రీనివాస!
పుట్టినవాఁడినేలవ । దేల నన్ను
నమ్మితిని లాఁతినని త్రోయ । నాయమగునె ॥కంజ॥ 6

సత్యవిచారమే । సంసారహరమంచు
సాధుసద్గోష్ఠియే । సారమంచు
జీవకారుణ్యమే । శ్రేష్ఠవర్తనమంచు
భావసంపత్తియే । భాగ్యమంచు
సౌజన్యభావమే । సత్యజీవనమంచుఁ
బూర్ణసంతుష్టియే । భోగమంచు
సద్ధర్మనియమమే । సద్వివేకంబంచు
స్వామిసంసేవయే । సౌఖ్యమంచు
తెలుఁగఁజేయుము మఱువక । మెఱుకనగుచు
మఱఁగివిరమింపకుండఁగ । గఱపుమయ్య ॥కంజ॥ 7

అమృతకరుండు నీ । యవతంసకుసుమంబు
    పరితాపభయమేల । భక్తపాల!
యాకాశగంగ నీ । యూఁదలవాసిని
    కలుషభయంబేల । కలినిహంత!
యన్నపూర్ణమ్మ నీ । యర్ధశరీరిణి
    క్షుత్తృష్ణ భయమేల । సుప్రసన్న!
యక్షేశ్వరుండు నీ । యత్యంతమిత్రుండు
    దారిద్ర్యభయమేల । ధర్మనిలయ!
యేదిలోపంబునాకింక । నీవుగలుగ
మాప్రొద్దుప్రతి నీపాద ! ములభజింతు ॥కంజ॥ 8

ఎడలేనినీచింత । యే సత్పథమని
    తెలిసియొనదియేమొ । తెలియలేక
తాఱుమాఱగుచుండె । తనమంచు ధనముయౌ
    వనమంచుఁబలువిధ । వాంఛలఁబడి
చెడివెఱ్ఱినైతిని । జిత్రమ్మెయరికట్టి
    బాధింపుచున్న దీ । భవమహాత్వ
మేమనిచెప్పుదు । హేయమై జీవన
    మలసటఁబుట్టించి । కలుషమయ్యె
నింతనాపూర్వపాపమో । యేమిసేతు
నోముమిఁకపిరాఁడ [illegible] ! [illegible] ॥కంజ॥ 9

తెలిపితివింతయుఁ దేటతెల్లంబయ్యె
నీకనీదఁగాదని । యీభవాబ్ధి
దిక్కెదిఱపియుఁ వ । ధీరుండెవండాగుఁ
దెలియ నినాఁడుతు । ముల విధానఁ
గడపితినాఁగాక । గౌరీవరా నీదు
పాదార్చనలుసేయు । భవ్యమతికి
భవములు బిరిగొని । బాధించికలఁపనిన్
వాఁకొని వినికని । వఱలుపెల్ల
నీదుపదములసేవించి । నీచుఁడైన
నేమిగలదింకనీవ న । న్నేలవలయు ॥కం॥ 10

పుట్టితిఁబెఱిగితి । బుద్ధినెఱింగితి
భవదీయకరుణచే । బ్రహ్మవాదు
లచ్చటచ్చటఁదోఁచి । యంతయుఁజెప్పిరి
కొన్నాళ్లుబరిచితిఁ । గొంటెనేఁటి
కనుభవించితి దుఃఖ । మంతయుఁదెలిసెను
భవములోఁగుట్టెల్ల । బయలుపడియె
మఱునాఁటికెప్పుడేన్ । మఱివద్దుచాలును
బుట్టుటగిట్టుట । భువనరూప
నీదుపదసాక్షియే కాంక్ష । లేదు నిన్నుఁ
గొలుచుచుంటయె నిత్యముఁ । గలుగఁజేయు ॥కం॥ 11

దుఃఖంబులకు మూల । దుంప యీసంసార
మతిఘోరమొక్కంత । హాయిలేదు
కీడులకూటము । గోడునరకాలయ
మొకయెడ శుభమునిం । కొక్కవంక
నశుభములును నెడ । మాడక చనుచుండు
బంధమింతంతని । పలుకరాదు
మేఘాలునాయాశ । లోఘంబులై వృథా
గలుగుచుఁజిక్కులఁ । గలుపుచుండు
నెటులనినుఁగొనియాడుట । యిదచరిత!
యీవెయిన్నియుఁబోఁగొట్టి । యేలవలయు ॥కంజ॥ 12

కాలంబసాధ్యము । కారణంబనిపించుఁ
బోల్క యెప్పట్లను । బోధపడదు
కర్మసౌఖ్యంబింత । గాలేదు పుట్టుట
కాదిమబీజఁపు । టంకురంబు
దారాసుతాదులు । ద్రవ్యకాంతాపరుల్
ధనము నానానర్థ । దాయకంబు
దేహంబుమలమూత్ర । మోహారోగాదుల
మయమాయువాకదు । మాయలాఁడి
మేదిసుఖమింకఁబుట్టుట । కేలచావు
లేనిగతిఁజూపియుఁడయ । జ్ఞానమిమ్ము ॥కంజ॥ 13

పెనురొంపిఁజిక్కిన | యెనుమట్లుమోహంపు
టవలనన్ బడికదు | నలసిసొలసి
తరియించుటెట్లులో | తరుణాంబుఁదేలి యిక
పేరాసవెంటనడఁ | బిఱుకుమూరి
దిక్కుదిక్కానక | పెక్కుద్రోవల సూఁకి
ః ఫలతరంగములఁ బల | వించుచున్న
దీనుండనీవనా | దిక్కునీ నమ్మిన
దానుండఁ బెడచెవిఁ | దార్చఁబోక
వినిదయన్ మించి నిత్యవి | వేకమిచ్చి
చిరతరానందపదవిని | జేర్పుమయ్య ||కంజ|| 14

ఏయద్వితీయుఁడీ | యెల్లజగంబులఁ
బుట్టించి రక్షించి | ప్రుచ్చుచుండు
ఏదేవదేవుఁడీ | యెల్లజీవులకును
దల్లియుఁదండ్రియై | దండనుండు
ఏయుద్ధచరితుఁడీ | యెల్లయిష్టార్థము
లిచ్చి లోకంబుల | నేలుచుండు
ఏజగన్నాథుఁడీ | యెల్లకర్మములకు
ఫలదాయకుండయి | పరఁగుచుండు
అట్టిపరముండవగు నిన్ను | నర్చసేసి
కలఁతఁబడకేల యీపాపిఁ | గావవయ్య ||కంజ|| 15

నీనామపఠనమే । నీమంబుగలవాని
పురుషత్వమే పుణ్య । పూరితంబు
నీపాదభజనమే । నిష్ఠగాఁగలవాని
జీవనమే శుద్ధ । జీవనంబు
నీకథాశ్రవణమే । నియతిగాఁగలవాని
జన్మమేసార్థక । జన్మమగును
నీభక్తసంగమే । నిత్యంబుఁగలవాని
చరితమేపావన । చరితమగును
గా కవేరేమిఁగలదు నీ । కన్నదేవ!
యంతయునునీవె నీవార । మ్మందరమును ॥కంద॥ 16

పాటించి నీనామ । పారాయణముసేయు
ధన్యాత్మునకు భవ । తాపమున్నె
హాయిగానీకథ । లత్యంతమును విన్న
మహనీయునకు నన్య । మమతలున్నె
మనసిచ్చి నీవాస । జనులతో భాషించు
సత్వాత్మునకుదుఃఖ । జాడ్యమున్నె
సంతోషమునను నీ । చింతఁగాలముఁబుచ్చు
బుద్ధిశాలికి మఱు । పుట్టువున్నె
యెంతభాగ్యము నీసేవ । యెంతసుఖము
మఱపురాదయ్య వృద్ధిగా । మనువుమయ్య ॥కంద॥ 17

త్రిపుటియుఁ దానయి । చపలబాహ్యముఁ జూపి
విశ్వుఁ డై యెవ్వఁడు । వెలయుచుండుఁ
గల్లజగంబులఁ । గల్పించి మేల్కొల్పి
తైజసుఁ డై యెవం । డోజ మెఱయు
అంతయు మాయించి । యజ్ఞానసుఖ మిడి
ప్రాజ్ఞుఁ డై యెవ్వఁ । డేపారుచుండు
ఎదిలేక తానయి । యొక్కటి యెఱుక యై
పరమాత్ముఁ డై యెవం । డరసియుండు
అట్టి నిన్ను ప్రస్మరియింతు । నఘము దులిచి
భవముఁ బోవ్రాల్చి నన్నుఁ గా । పాడుమయ్య ॥ కంద ॥ 18

నీపాదభజనమే । నెమ్మిచేఁ జెలఁగక
మూఢుఁ డై యేటికో । మూరియుచుందు
నీకథల్ వినఁడయే । నీతిమైఁ జెలఁగక
దేబె నై యేటికో । తిఱుగుచుందు
నీచింతనముఁ జేసి । నేమముఁ జెలఁగక
పశువు నై యేటికో । పంతగింతు
నీపాటఁ బాడఁ జేసి । నిష్ఠచేఁ జెలఁగక
వెఱ్ఱి నై యేటికో । ప్రేలుచుందు
నిన్నుఁ దెలిసినవారు దా । నున్నయాపు
వెలిఁగి సుఖముండఁ దరమె లో । నేకనాథ! ॥ కంద ॥ 19

చింతించిననునిన్నే । చింతింపఁగావలె
నిచ్చిననీవయే । యీయవలయు
సేవించినను నిన్నే । సేవింపఁగావలె
నేలిననీవయే । యేలవలయుఁ
బాతించినను నిన్నే । పాటింపఁగావలెఁ
బ్రోచిననీవయే । ప్రోవవలయుఁ
జేపట్టినను నిన్నే । చేపట్టఁగావలెఁ
దనిసిననీవయే । తనుపవలయుఁ
గాక యితరుల వేడినఁ । గలదెసుఖము
ఫలము లొండగూడునే భవ । బాధచనున ॥కం॥ 20

దోషాటవీమహా । స్ఫురపావకంబు నీ
నామసంస్మరణంబు । కామదహన!
ఆర్త్యంధకార తీ । వ్రాంశుప్రకాశంబు
భవదనుచింతన । బ్రహ్మరూప!
భవబంధజీమూత । పటలసమీరంబు
యుష్మత్కథాలాప । మురగధీర!
దుఃఖభూధరచక్రి । దుర్వారభిదురంబు
తావకీయార్చన । ధర్మనిలయ!
ఇంతయేటికినీభక్తి । యే సమస్త
విద్యలకుదొడ్డయుదిలేని । వెట్టిలేల ॥కం॥ 21

కోర్కెలెవ్వియులేవు । కొనసాగవంచును
దలఁకేలనిన్ సదా । తలఁచుచుందు
ఆపదలుండుట । నరయనునీదయా
కలసరానిన్నని । కొలుచుచుందుఁ
గాలత్రయంబును । గణియింపనెప్పుడుఁ
బ్రియుఁదండ్రియని । పిలుచుచుందు
ఎదియెట్టులోయని । మెఱుఁగంగఁజింతింప
నీసేవకులచెంత । నిలుచుచుందు
దైవమాయంచుఁబలుమారు । దండమిడుదు
నేదియెటులెంచియేలెదో । యీవెదిఁకఁ ॥కంజ॥ 22

పరమేశ! నీనామ । పారాయణముసేయు
భాగ్యమెన్నఁడునాకుఁ । బట్టునొక్కొ
లోకేశ! నీకథల్ । వాఁకొనఁగలయట్టి
పుణ్యమెన్నఁడునాకుఁ । బొందునొక్కొ
శ్రీవాస! నీచింత । చే జీవనముసేయు
ఘనతయెన్నఁడునాకుఁ । గల్గునొక్కొ
గౌరీశ! నీభక్త । కైవారములుసేయు
నలవియెన్నఁడునాకు । నబ్బునొక్కొ
దేవనీవాఁడనై నీదు । సేవసేసి
పూర్ణమునుజెంద నాకెప్డు । పోలునొక్కొ ॥కంజ॥ 23

ఎట్లులంబూనిన । నిష్టమేయువుఁగాని
మూర్ఖసాంగత్యంబు । మొనయనీకు
వేషముల్గట్టిన । నీప్సితంబవుఁగాని
కపటులమైత్రిని । కలుగనీకు
ఎట్లుపాదలఁచిన । నియ్యకోలవుఁగాని
చెనటులసంగతిఁ । జెందనీకు
ఎట్లాదరించిన । నిచ్ఛయేయువుఁగాని
గర్వులతోఁబొత్తుఁ । గలుగనీకు
దండమర్పింతులాఁతిని । దార్చఁబోకు
దైవమా చేర్చు నీదండఁ । దండ్రివగుచు ॥కంజ॥ 24

గౌరీశ! నీకథా । కర్ణనంబే కాని
యొండెద్దిదలఁపక । యుండనిమ్ము
పరమేశ! నీనామ । పారాయణమె కాని
యొండెద్దివలుకక । యుండనిమ్ము
సర్వేశ! నీపదా । బ్జములసేవయె కాని
యొండెద్దెనలుపక । యుండనిమ్ము
లోకేశ! నీసదా । లోకనంబే కాని
యొండెద్దియరయక । యుండనిమ్ము
దేవనీవాఁడనాఁడేఁడ । నీవ చూడఁ
దొరవుగానియడ విడవాఁడ । నరసినాఁడ ॥కంజ॥ 25

నీనామమేకదా! । నిఖిలరోగములకుఁ
బరమౌషధంబగుఁ । బరమపురుష!
నీభక్తియేకదా! । నిఖిలతాపములకుఁ
జంద్రోదయంబగుఁ । జంద్రజూట!
నీసేవయేకదా! । నిఖిలదోషములకు
నభ్రవాహినియగు । నభ్రకేశ!
నీచింతయేకదా! । నిఖిలదుఃఖములకు
శాంతధామంబగు । శాంతరూప
నీస్వరూపానుసంధాన । నిత్యయోగ
యుక్తియేకద భవవార్ధి । కుగ్రవహ్ని ॥కంజ॥ 26

ఉద్యోగమనిమది । యుప్పొంగఁగాఁబోను
గౌరవంబనియెందు । గాంక్షలేదు
బలగమంచును బుద్ధి । పారదుచిత్తంబు
ధనమార్జనముసేయఁ । దగలనీదు
ఫలములకైయాశ । పరఁగదుయౌవన
మనియెందు చింతర । వంతలేదు
భోగమంచును గోర్కె । పుట్టదు స్వర్గాది
పదవులపైనిచ్ఛ । పరఁగఁబోదు
ఏదియునులేదు నీచింత । యె సతంబుఁ
గలిగియుఁటకు మననయ్యెఁ । గావుమయ్య ॥కంజ॥ 27

కొన్నాళ్లుగర్భానఁ । గుతలంబుపైఁబడి
కొన్నాళ్లుబాల్యానఁ । గొన్నినాళ్లు
దారేషణన్ జిక్కి । తరుణంపుఁబ్రాయానఁ
గొన్నాళ్ళుబిడ్డల । గొడవలోనఁ
గొన్నాళ్లువిత్తంబుఁ । గూర్పఁ బ్రయత్నానఁ
గొన్నాళ్లుచుట్టాలి । కొలువులోన
నేగెముప్పదియొకం । డేఁడు లీనాఁటికి
సంసారమునఁగల్గు । సారమెల్లఁ
దెలిసెభవమింకఁజాలును । గలదినాలఁ
బూర్ణతృప్తిభవచ్చింతఁ । బొదలఁజేయు ॥ కంజ॥ 28

ఏనాఁటికైన ని । న్నేకొల్చెదనుగాని
యితరులవేఁడఁగ । నియ్యకొనను
బాటించిరెందరు । పలికిననేమేని
గైకొనునీపద । కాంక్షఁదక్క
విసువనునీవేమి । వెఱ్ఱిఁబుట్టించిన
భవదీయనుతులు నా । పాలివంతు
పాలముంచుజలానఁ । బడఁద్రోయు నీకంటెఁ
బ్రభుఁడొక్కరుఁడులేఁడు । భయములేదు
దైవమా! యేమిసేయుంగఁ । దలఁచినావొ
నీదుపదసాక్షియేమైన । నీవెసుమ్ము ॥ కంజ॥ 29

పుట్టినయప్పుడే । గిట్టిననేమగుఁ
దరుణమందునఁజావఁ । దగవుగలదె
మూఁగయైపోయిన । నేగదే యాయువు
గ్రుడ్డియైయుండుట । క్రొత్తమగున
వెఱ్ఱులైయుండుట । వింతయేగతిలేని
బానిసలై యుంట । పరఁగఁబోదె
రోగులై యుండుట । రూఢియేయవుఁగదా
శాంతులై యుండుట । చూడఁబోమె
ఇన్నియునులేక ప్రాణము । నన్నమిచ్చు
నిన్నుఁగొలువనిబ్రతుకేల । నిర్మలాత్మ ॥౪౦॥ 30

పదికోట్లధనమున్న । భాగ్యవంతుండయ్యు
నీసేవలేకున్న । నీచుఁడగును
భాష్యాంతముఁగన్న । పండితుండయ్యును
నీసేవలేకున్న । నీచుఁడగును
దిగ్విజయముఁగొన్న । దేశాధిపతియయ్యు
నీసేవలేకున్న । నీచుఁడగును
సిద్ధులన్నియుఁగన్న । చిరజీవియయ్యును
నీసేవలేకున్న । నీచుఁడగును
ఎన్నియున్నను నీసేవ । తెలియఁగకున్న
మనుజుఁడేయాతఁడొకరీతి । యెనుముగాక ॥౪౧॥ 81

నీసేవనానిష్ఠ । నొనడినవారలే
ధన్యాత్ములలఘులు । దారమతులు
సౌజన్యనిధులు వి । చారణాతీతులు
చరమార్గవిదులు ప్రా । జ్ఞానఘనులు
పెఱవారలేటికి । వెడఁగులై యేమేమొ
గొడవలనాయువు । గొఱఁతపడఁగ
నెఱలఁగాంచిన మీాల । తెఱఁగున నీల్గుచుఁ
జచ్చుచుఁబుట్టుచు । శాంతిలేక
దుఃఖవారాశిమున్గుచుఁ । దూలుచుందు
చిత్రమిది నిన్నుఁగొలువక । చెడెదరిట్లు ॥కంద॥ 32

తగవులఁదీర్చుచు । ధనవంతులై యుండి
నినుఁగొల్వకున్నను । ఘనతకలదె
పౌరుషంబులుగల । బంటులై పోరాడి
నినుఁగొల్వకున్నను । ఘనతకలదె
నేర్పరులైవృథా । నీల్గుచు గడిమించి
నినుఁగొల్వకున్నను । ఘనతకలదె
పెద్దలైదీనులఁ । బీడించిమేలొంది
నినుఁగొల్వకున్నను । ఘనతకలదె
పట్టివిడియేల నీపద । పద్మసేవ
యొండుచాలదె యిదుమీాదే । దండమిదుదు ॥కంద॥ 33

ప్రాణులకనుకూల | భద్రంబులిడిమెడి
పరిభుఁడవంచెఱఁగెదఁ | బరమచరిత!
సర్వాంతరాశసం | చారివంచును నీకు
నెఱిఁగింపఁదలఁపనే | మేనియుభవ!
కోరనొక్కటితప్పఁ | గొనియాడుటే మీఁద
నీదయారసమె నా | కేదిగొఱఁత
పట్టితినీపాద | పద్మముల్ బుట్టితి
గిట్టితిననుకొంటిఁ | గీడులేదు
నీదుదాసులకనివింటి | నేరములను
దలఁపకేప్రోవుమంటినన్ | దనువుమంటి ॥కంజ॥ 34

లోకులుగాకులు | చీకాకులిడఁబోరు
రన్యాయమునకున్నె | యులుకుచుందు
కలుఁగరుయమబాధ | లేమాటఁదెలియరు
గలఁతలుమెండు | నిక్కవటిలేదు
నిజమాడకుండిన | నిందింతురు నిజమాడ
నెగ్గుజనించున | దేమికతము
నీమాయఁదెలియఁగ | నేరరాదేకి
నైహికమొకవింత | యాటయయ్యె
నిన్నియునుజూడ నాకేది | తెన్నులేక
నిన్నుచేరితిఁబ్రోవుమా | పన్నరక్ష! ॥కంజ॥ 35

నీదాసుఁడనుగాని । నేనెవ్వఁడనుగాను
కొఱమాలఁజేయకో । కుటిలహరణ!
నీసుతుండనుగాన । నిన్నేలవిడుతును
బ్రోవవేటికినన్ను । భువనభరణ!
నీవాఁడనై యుండి । నీసేవసేయనే
పాలింపరావేల । పరమచరణ!
నీసృష్టినయ్యును । నిన్ జేరకుందునే
యాదరింపవదేమి । యఖిలశరణ!
భవవిమోచన నీపాద । పద్మభజన
మఱువమఱువను నీసాక్షి । మదనదమన! ॥కంద॥ 36

ఏకర్మఫలమున । నీపుట్టువయ్యెనో
యెంతకాలంబిట్లు । లేఁగవలెనో
ఎప్పుడేనాఁటికి । నేదియోనీచిత్త
మంతయుఁదెలియంగ । నగునునీకు
నీచేతిబొమ్మను । నిన్నుమఱచినట్లు
మఱువవునీదయఁ । బఱచినావు
రక్షింపఁబడితిని । శిక్షయుఁదెలిసెను
భౌతికమన్నను । భయముగలిగె
నలసితినిదుఃఖమడఁగించు । మమృతపదవి
నిమ్ముతండ్రీ! గతాఘము । లెన్నఁబోకు ॥కంద॥ 37

ఏకర్మఁజేసిన । నేమగునగుఁగాక
నిష్కర్మిగానుంట । నేర్పుమయ్య
ఏభోగముండిన । నేమగునగుఁగాక
నిర్భోగిగానుంట । నేర్పుమయ్య
ఏకామముంచిన । నేమగునగుఁగాక
నిష్కామిగానుంట । నేర్పుమయ్య
ఏవాదులాడిన । నేమగునగుఁగాక
నిర్వాదిగానుంట । నేర్పుమయ్య
ఈవనాయయ్యవయ్య పో । నీయనయ్య
అభయమీవయ్య కరుణార । సాబ్ధినయ్య ॥కంజ॥ ౩౩

ఏనొక్కదాసుండ । నేకానుగర్వని
శమదమాదులెఱుఁగ । శక్తిలేదు
తలఁపోయనాకేది । ధైర్యంబు తత్త్వమ
సీత్యాదివాక్యార్థ । మెఱుకవడెనె
భక్తుఁడనాయేది । భవబంధమోచన
కలిగెనాలోలోన । వెలినిగాన
ఎయ్యదితెఱవాక్కు । మెఱిఁగినవాఁడనే
కాలత్రయాతీత । గణనకలదె
అజ్ఞుఁడనుజేతఁగాదేమి । యైనఁజేతు
లొగ్గివేఁడితి దీనుఁడ । నోముమయ్య ॥కంజ॥ ౩౪

అజ్ఞానినై దుర । హంకారమునఁగను
గర్వించిపెద్దలఁ । గలఁచినాఁడఁ
గామినై మాయాజ । గత్తు సత్యమ్మని
జడుఁడనై కాలంబు । జరిపినాఁడ
రాగినై మమతచే । రంజిల్లి దుర్మార్గ
చిత్తజని వృథా । సేసినాఁడ
లోభినై యేమేమొ । లోలోనఁజింతించి
కొఱమతినై నిన్ను । మఱచినాఁడ
ఏదినాయొప్పుతప్పని । యెన్ననేల
తప్పులనుదిద్దికన్ బ్రోవఁ । దగవెనీవు ॥కం॥ 40

గాడిదబరువులీ । ఘనతలునాకేల
పేరాసలేటికా । పేదబ్రదుకు
కంఠశోషణలేల । గంభీరవాక్కులు
ధనమదేటికి దుఃఖ । దాయకంబు
కులమేల నిర్బంధ । ముల యిక్క వివిధంపు
వేషభాషలవేల । నెఱ్ఱితనము
గర్వంబునాకేల । గౌరవభంగంబు
పలుపోఁకలేటికి । పామరంబు
అష్టమదములఁజిక్కి ని । కృష్టగతిని
బొందుకష్టాత్ములన్గంటిఁ । బ్రోవుమంటి ॥కం॥ 41

పనిమాలి సత్యంబుఁ । బరసేవ సేయుచు
నీచుఁడనైతినో । నిఖిలదక్ష!
దయమాలి జీవుల । దండించి ఖండించి
పాపుఁడనైతినో । భక్తపక్ష!
కొలమాలి పెద్దలఁ । గొనియాడక త్యజించి
ద్రోహుఁడనైతినో । దుష్టశిక్ష!
మతిమాలి నీమహో । మహిమలు విన లేక
మూఢుఁడనైతినో । భువనరక్ష
చెడితి దిక్కెవ్వఁడియును లేదు । చేరఁదీసి
మనుపుమీఁక మీఁదఁ దెలిసెనిన్ । మఱువనయ్య ॥కంజ॥ 42

ఆత్మాపరాధము । లత్యంతము గఁజేసి
పైవేషములు సూపు । భ్రష్టుఁడేను
స్వార్థమె లోలోనఁ । జదువుచు బూటక
కనికరింపులు సూపు । కష్టుఁడేను
జడిముడి మనసులో । నిడుకొని పెఱవారి
దోషంబులను నెంచు । దుష్టుఁడేను
మోహాంధుసందడి । మునుఁగుచు వైరాగ్య
నామంబు వాఁకొను । నష్టుఁడేనును
దైవమాయింక నాతప్పుఁ । దలఁపనేల
ఏలు మెట్లున్న నీతత్వ । మెఱిఁగినాఁడ ॥కంజ॥ 43

కడుదోషములఁజిక్కి । చెడితిశుద్ధినొనర్చి
సాలోక్యమీయవొ । నరసభూప!
అతిదుఃఖములసొక్కి । యదరితిగతిఁజేర్చి
సాన్నిధ్యమీయవొ । సత్కలావ!
బహువేదనములఁజిక్కి । భ్రమసితి మతిఁగూర్చి
సారూప్యమీయవొ । సాక్షిదీప!
పలుదోవలన్ద్రొక్కి । బడలితిఁ దెరవూర్చి
సాయుజ్యమీయవొ । సత్యరూప!
బ్రహ్మపదవిమ్ము దుఃఖము । వాయనిమ్ము
గమ్ము దాతవునన్నేలు । కొమ్మరమ్ము ॥కంఠ॥ 44

జన్మమిచ్చితి మంచి । జాతిఁబుట్టించితి
వారోగ్యమిచ్చితి । వాయువిడితి
చదివించితిన్నియు । సమకూర్చి భవవార్ధిఁ
బడద్రోచియిట్లేల । భ్రమయఁజేతు
దయఁజూడమార్తుల । దండింపనింకేల
ముచ్చిచ్చుకాకల । మూల్గుచుండ
నాకేమియనవచ్చు । నాభీతినెఱుఁగవు
గాకేమిభరియింపఁ । గలవొచూడు
పైఁపనిందాక వెట్టిగా । సలిపినావు
దెలిసెనిఁక నైనఁబ్రోవుమో । దీనరక్ష ॥కంఠ॥ 45

చిత్తయోగమె యోగ । వృత్తియంచెఱుఁగక
వృత్తిమై యేమేమొ । వెదకుచుందుఁ
తన్నెఱుంగుటె నిజ । ధర్మమంచెఱుఁగక
ధర్మినై యేమేమొ । తలఁచుచుందుఁ
త్యాగియౌటయె మహా । భోగమంచెఱుఁగక
భోగినై యేమేమొ । పొందుచుందుఁ
బరుసమాడమియె ని । ష్పాపమంచెఱుఁగక
పాపినై యేమేమొ । పలుకుచుందుఁ
దెలయులేకుంటి నైఁచినా । దిక్కుఁజూచి
జడిమసడలించుమిదె నమ । స్కారమయ్య ॥కంజ॥ 46

పనులెన్నొ చేయుచు । భ్రమసియుందుదుఁగాని
నీపనిఁజేయుంగ । నోపనేను
చూపులెన్నియొచూచి । స్రుక్కియుందుదుఁగాని
నీచూపుజూడంగ । నేరనేను
రుచులెన్నొ చూచుచు । రోసియుందుదుఁగాని
నీరుచిఁజూడంగఁ । గోరనేను
మాటలెన్నియొ యాడి । మఱచియుందుదుఁగాని
నీమాటలాడంగ । నేర్వనేను
ఎంతపాపినొ నీచింత । మెఱుఁగలేను
మూఢజనుఁడను క్షమియించి। మోక్షమిమ్ము ॥కంజ॥ 47

చర్చలన్నియుసల్పి । చర్చింపరాదు నీ
చర్చయే బ్రహ్మమో । సదయహృదయ!
చేఁతలన్నియుఁజేసి । చేయంగరాదు నీ
చేఁతయే చిత్రమో । శ్రీనివాస!
పోఁకలన్నియుఁబోయి । పోవంగరాదు నీ
పోఁకయే పూర్ణమో । భువనరూప!
చింతలన్నియుఁగల్గి । చింతింపరాదు నీ
చింతయే పుణ్యమో । చిద్విలాస!
ఎంతఘనమెంతసుఖము । నిన్నెఱిఁగిమనుట
మేటియనితోఁచె విడువనే । నాఁటికైన ॥కంఠ॥ 48

ఒకపోల్కెనుండవు । సకలంబునీవయై
యొకఁడవై సాక్షివై । యుందు దేవుడు
నేనెంతయజ్ఞుఁడ । దీనుండఁ దెలియంగ
నావశంబే నీవు । బోధవశున్నఁ
గలకాలమొకరీతి । గానుంపఁబాడియే
దాసుండనాకొప్పు । తప్పులేల
ఎదిరెఱుంగకయున్న । నింతయునీవని
తెలిసితినింకేమి । తెలియవలయు
నేటికీజాలమెవ్వఁడైన । నేలకున్నఁ
తెలియదొండేమియును నీదు । తలఁపుకంటె ॥కంఠ॥ 49

ఏపాపములసేయ । నేచేయువాఁడనే
క్షమియించుమోదేవ! । శరణుశరణు
ఏనేరములుసేయు । నేచేయువాఁడనే
క్షమియించుమోదేవ! । శరణుశరణు
ఏగోరములుసేయు । నేచేయువాఁడనే
క్షమియించుమోదేవ! । శరణుశరణు
ఏమోసములుసేయు । నేచేయువాఁడనే
క్షమియించుమోదేవ! । శరణుశరణు
చేసితినిదొల్లి తెలియక । చేయనింకఁ
గొలుతునిన్నె క్షమియుఁ । గోరఁబోను ।కంజ॥ 50

విషయరూపాఖ్య వి । భేదంబులటువెట్టఁ
బరిపూర్ణమూర్తివై । పరఁగినావు
విశ్వాదిజీవుల । వివిధత్వమెడఁదొల్గ
నద్వితీయుండవై । యలరినావు
కార్యకారణముల । క్రమమెల్లఁదిలకింప
నిష్కారణంబవై । నెగడినావు
స్మృతివిస్మృతులసాక్షిఁ । జింతించితెలియంగఁ
జిత్ప్రకాశంబవై । చెలఁగినావు
నిన్నునేరీతినేమని । యెన్నఁగలదు
నాపభావంబుమెనవా । తలఁచుకంజ ।కంజ॥ 51

మంత్రిమూర్తి వటంచు । మదినెంచిపఠియింప
జడమయిశబ్దము । సత్యమయ్యె
ధ్యానమూర్తి వటంచు । మానిన్నై భావింప
మఱుపయిచిత్తము । మాయయయ్యె
సగుణమూర్తి వటంచు । సాధించివీక్షింప
నిచ్ఛయైదృశ్యము । దృశ్యమయ్యె
విశ్వమూర్తి వటంచు । విశ్వసించిగణింప
కలయయి జన్మమే । కల్లయయ్యె
ఎన్నినిన్ గొల్చుటో లేక । యీవెనేనో
యెఱుఁగరాకున్నదది తెల్పి । యేలుమయ్య ॥శం॥ 58

అస్మద్గుణంబుల । నారయఁదలపేల
తెలియవానీకడ్డు । తెరలుగలవె
పరిపూర్ణుఁడవు నిన్నుఁ । బొడఁగనెవఁడోపుఁ
గరుణాకటాక్షముల్ । గడలుకొనఁగ
వీక్షించినామొఱల్ । వినవేల నీనుతుల్
కొఱగానులైనను । గొఱఁతగాదె
చేయించువాఁడును । జేయువాఁడును తేఁత
యును నీవు కర్మని । కుందునొక్కొ
మాయఁజడమయ్యె జీవుఁడ । మాయఁడయ్యె
నవరిఁదప్పనిశిక్షఁతు । వేలవేల ॥శం॥ 59

యమనియమాదుల । యనువెఱుంగను మంత్ర
తంత్రవిధోంకార । ధర్మమెఱుఁగ
షట్కమలంబుల । సత్వంబుదెలియను
నాడులఁదిలకించి । నడుపలేను
ముద్రలేవియురావు । భద్రాసనాదుల
చవిలేదు తీర్థప్ర । సాదమహిమ
తెలియఁగను నానాదు । లెట్టివోకనలేదు
నాదీక్షరయొక్కఁడే । నాఁటికైన
నీదునుతిఁజేతునే నీవు । నీవెయనుచు
నిన్నుమఱువను నన్బ్రోవ । కున్న విభుఁడ ॥కం౦॥ 54

తాపత్రయంబును । దరలించి దయనెంచి
కాపాడఁజూతుమో । పాపహరణ!
ఈషణత్రయమును । నీల్గించిదయనెంచి
పాలింపఁజూడుమో । భక్తరక్ష
కర్మత్రయంబును । ఖండించి దయనెంచి
చేకొనఁజూడుమో । శ్రీకలాప!
వాసనాత్రయమును । వదలించిదయనెంచి
మనుపంగఁజూడుమో । మాన్యచరిత!
దుఃఖమడఁగించు వైరంబుఁ । దోఁపనీకు
మిమ్మునీసేవసతతంబు । నింతేచాలుఁ ॥కం౦॥ 55

మేలెంచియెవరేని । మేల్మేలటంచును
వాఁగొన్న నాకేమి । వచ్చుననుచుఁ
దూలించియెవరేనిఁ । గేలిసేయంగను
దొరకొన్న నాకేమి । దోసమనుచుఁ
బేలించియెవరేనిఁ । బిచ్చివాఁడనుచును
దార్కొన్న నాకేమి । దక్కువనుచు
లాలించియెవరేని । లగ్గుఁదెల్పంగను
వెంకొన్న నాకేమి । వింతయనుచు
సర్వమున్ వీడినన్ సదా । శరణువేఁడి
మొక్కి జీవించువాఁడనన్ । బ్రోవుమయ్య ॥కం॥ 56

ఎన్ని శాస్త్రంబుల । నెంతెంత చదివిన
నిన్నె వచింపుచు । నున్నవయ్య
ఎందరగురువుల । నెట్టులడిగిన
సర్వంబు నీవగా । చాటిరయ్య
ఏ సాధుజనులతో । నెట్లు ప్రసంగింపఁ
బరమార్థమీవని । పలికిరయ్య
ఎన్ని భావంబుల । నెందాఁకఁ జింతింప
మిన్నయై నీరూపె । మిగిలెనయ్య
ప్రోవఁగదవయ్య నా పాలి । పుణ్యమయ్య
చేరఁజెఱినయ్య నన్ ముక్తుఁ । జేయుమయ్య ॥కం॥ 57

శ్రవణాదులెఱుఁగని । భవబద్ధుఁడీనీదు
పుత్రుఁడో మహానీయ! । పుణ్యదాయ।
వాక్యాళినెఱుఁగని । వల్లవుఁడీనీదు
దాసుఁడో నిర్లేప! । ధర్మరూప!
సాధనాలెఱుఁగని చార్వాకుఁడీ నీదు
భక్తుఁడో భువనేశ! । పావనాశ!
ధనములనెఱుఁగని । మందజ్ఞుఁడీ నీదు
బంధుఁడో సంపూర్ణ! । పాండువర్ణ!
ఎఱుఁగనేమేని నీనుతు । లేసతంబుఁ
జేతుభవబంధమోచన । చేయుమయ్య ।కం॥ 5

పడిసన్న లేకుండ । సాక్షివై నీవుంటఁ
దెలియను మత్తెక్కి । తిఱుగుచుందుఁ
బ్రాక్కర్మఁదలఁపను । బాగునేకోరుదు
సత్కర్మలేమియు । సలుపఁబోను
మదియందునీవుంట । మతిలేమి కపటంపు
బద్ధులఁగాలంబుఁ ।బుచ్చుచుందుఁ
బ్రాణమన్నమునిచ్చు । ప్రభుఁడవంచుఁదలంప
నేనుసేసనుచును । నిక్కుచుందు
నేమిసేయుదునజ్ఞాన । మిట్లుచేసెఁ
దప్పుక్షమియించిరక్షించు । దండమిడుదు ।కం॥ 6

ఏమాటలాడంగ । నెట్లైన నగుఁగాక
నీమాటలాడఁగ । నేరరాదు
ఏయూహ నుండఁగ । నెట్లైన నగుఁగాక
నీయూహనుండఁగ । నేరరాదు
ఏచింతసేయంగ । నెట్లైన నగుఁగాక
నీచింతసేయంగ । నేరరాదు
యేచూపుఁజూడఁగ । నెట్లైన నగుఁగాక
నీచూపుఁజూడంగ । నేరరాదు
ఎంతయజ్ఞానమివియున్న । యేల నీదు
భక్తి లేకున్న దుఃఖంబు । వాయునెట్లు ॥౬౦॥ 60

పాండిత్యమున్నను । ఫలమేమి నీధర్మ
మెఱిఁగింపవలయుఁదా । నెఱుఁగవలయు
గాయకుండైయున్న । ఘనమౌనె నీపాటఁ
బాడింపవలయుఁదాఁ । బాడవలయు
గురువయియున్నను । గొప్పతమే నీసేవ
మరగింపవలయుఁదా । మరగవలయుఁ
బదువరియైయున్న । సంభ్రమౌనీకథల్
వినిపింపవలయుఁదా । వినఁగవలయు
ఎఱుఁగ నేటికి పెక్కింటి । నేకమనుచుఁ
దెలిసినను తాదెలియుచున్నయుఁ । దెలిసినట్లు ॥౬౧॥ 61

భోగినైయెపలురుచుల్ । భుజియింప ఘనవరాని
　　నీనామమాధుర్య । మానకున్నఁ
బేరుకై యొకయింత । పెద్దైనలాభమే
　　సతతంబునీసేవ । సలుపకున్న
శయ్యపై హాయిగా । శయనింపగొప్పయే
　　సద్విచారిణసదా । జరుపకున్న
ధనరాశిపైనుండి । తర్కింపశ్రేయమే
　　సమితదాసుండై । నడువకున్న
ఎన్నియున్నను నిన్ సదా । యెన్నకున్న
మన్నయానన్నిముక్తియు । నున్నయవును ॥కంజ॥ 62

మన్ననసెఱుఁగక । మతిమంతులనుదిట్టి
　　కేడింపలాభమే, । కీడుగాక
అజ్ఞానినైయెనీకు । నపరాధములుసేసి
　　సవిఘ్నసౌఖ్యమే, । రవ గాక
కుంఠనైయెజీవుల । సుఖమెఱుఁగక కొట్టి
　　నిక్కునఁగుశలమే, । చిక్కుగాక
కలుషినైయెరిత్తగాఁ । గాలంబుఁబుచ్చుచు
　　నుబ్బనశ్రేయమే, । దెబ్బగాక
అనుచానివియెల్లవీడి నీ । యడుగుదోయిఁ
బట్టితినిఁబో)వుమింక । నోపరమపురుష ॥కంజ॥ 63

నీకు దాసులు గారు । నీ దాసులను జూచి
యోర్వలేరంతట । నూరుకోనరు
పనిబూని వికటముల్ । బచరింతుఱ దుదముట్ల
నారాటములు సేయు । నలమికొంతుఱ
నిక్కుచు నీల్గుచు । సేనంచుఁ బలవించి
మెఱుఁగరు నీమాయ । నించుకంత
భాషించెదరు వృథా । భాషణంబులు నిన్నుఁ
బాడరు కల్యాణ । భావులగుచు
పరులఁ గొలిచెదరీవన్నఁ ॥ బరిహసింతుఱ
భ్రమసి మూర్ఖాత్ములిఁక నేమి । వలుకఁగలదు ॥కంద॥ 64

తానెఱుంగఁడు శెఱ । తగవులఁ దీర్పంగఁ
బలువెత్తు బానిస । పాటికాఁడు
మానవుండో కాఁడో । మతిలేదో నీవుంట
నెఱుఁగఁడో మత్తత । నెనసియుండుఁ
దనకంటె నీచుని । ధర్మాత్ముఁగా నెంచు
సుజనులఁ జుల్కఁగాఁ । జూచుచుండుఁ
జేరావిరిష్ఠమా । బెదబెదజీవించు
గతిలేక నాకొక్కప్పు । కష్టపడును
దెలియదింకేమి సేయును । దులువకాకి
యటులఁగా నీవ నన్నుని । న్నరయనిమ్ము ॥కంద॥ 65

ఏవేళనీసేవ । లేపారఁజేసెదో
శుభదమైయావేళ । సొబగునించు
ఏపూటనీకథ । లింపుమై నుడివెదో
మహదమైయాపూట । మహిమఁబెంచు
ఏజామునీభక్తి । నెసఁగియొనర్చెదో
వరదమైయాజాము । వన్నెఁగాంచు
ఏతుటినీచింత । నెంతయునుండెదో
సుఖదమైయాతుటి । శోభఁగాంచు
ఇతరములుపాపుదినముల । వేలనాకు
బ్రతుకుదినములఁజూపి కా । పాడుమయ్య ॥కంజ॥ 66

కామాదిగుణముల । ఖండించి యింద్రియ
దశకంబువృత్తుల । దమకమడఁచి
చిత్తంబుదుర్విష । యాత్తంబుగానీక
యాలస్యవేగంబు । లణఁగఁద్రొక్కి
శమదమాదులఁగాంచి । సావధానతవహించి
భాండగతప్రదీ । పంబుఁబోలి
ఏకమైనీనాల । నెన్నక సంపూర్ణ
దశనున్నఁగాక నీ । దర్శనంబు
గలుగునేయుత్తగోడవలఁ । గల్పశతము
బుట్టిచచ్చిననన్నేని । బొందియున్న ॥కంజ॥ 67

నీరన్నఁ జినుకన్న । నీరమేయగునట్లు
నీవన్న నేనన్న । నీవుగాదె
లేదన్నఁ గాదన్న । లేమియేయగునట్లు
కలయన్న నిలయన్నఁ । గలయకాదె
రూపన్న రేఖన్న । రూపమేయగునట్లు
వెలుకన్న బయలన్న । వెలుక కాదె
మృత్తన్న ఘటమన్న । మృత్తికేయగునట్లు
సత్తన్నఁ జిత్తన్న । సత్తుకాదె
సత్యమెఱిఁగిన నీకన్న । సర్వమేది
తెలియకున్నాను నన్ బ్రోచి । తెలుపుమయ్య॥కంజ॥68

హీనుండ నేఁగాన । యీవాటఁ దెలియని
యవివేకమీరీతి । నలమికొనియె
పాపుండ నేఁగాన । బంధంబుగలదను
నజ్ఞానమీరీతి । నావరించె
దీనుండ నేఁగాన । దేవుఁడేడీయను
సంశయంబీరీతి । సంక్రమించె
అల్పుండ నేఁగాన । యదియిది వేరను
భ్రాంతితత్వమీరీతిఁ । బ్రబలకొనియె
ఎంతగోరము నీవేను । నేకమనుచుఁ
దెలియనిన్నాళ్లులిఁకనైనఁ । దెలుపుమయ్య ॥కంజ॥ 69

పలువిధంబులునయి । బయలయిపూర్ణమై
శోభిల్లునిన్నట్లు । చూడనగును
నేనయినీవయి । నీనాలునన్నమై
వెలుగొందునిన్నట్లు । వెదకనగును
సత్తు వెచిత్తువె । సాక్షిమాత్రుండవై
భాసిల్లునిన్నట్లు । పట్టనగును
వేదసారంబవై । విశ్వరూపుండవై
దీపించునిన్నట్లు । తెలియనగును
తుదియుమొదలీవె పూర్ణసం । తోషివీవె
ఆత్మయనీవె వేయేల । యఖిలమీవె ॥కంజ॥ 70

ఉపదేశమిదియంచు । నూఁకొన్న నేదేని
నీపేరుచాలదే । నిఖిలమాయ
సముద్రిఁడైభవదర్శ । నారతుండై యున్న
నెవఁడేనిఁజాలఁడే । యెల్లఁదెలుప
నిజమనియింతయు । నీవనికనుఁగొన్న
నేచాయలేవొకో । యీవుదోఁప
యోగియైయెదుర్గుణ । త్యాగియైవర్తింప
నెచ్చటఁగలుగవో । యెట్టులేనిఁ
కలవునీవని హృదయానఁ । గలవటంచు
సతముమఱువనివానికి । జన్మకలదె ॥కంజ॥ 71

కర్మలన్నియుఁజేసి । కర్మిష్ఠిఁ గాఁడు నీ
దాసానదాసుఁడు । ధర్మనిలయ!
కొఱతలెన్నియుఁగల్గి । కొఱవాఁడు గాఁడు నీ
భక్తోత్తముఁడు సదా । భక్తపాల!
పలుపోఁకలనుబోయి । పలుగాకి గాఁడు నీ
పాదార్చకుఁడు దయా । పాదహృదయ!
కులధర్మములుగల్గి । కులసంగి గాఁడు నీ
సేవైకపరుఁడు స । ద్భావరూప!
ఇంతయేటికి నీమర్మ । మెఱిఁగియున్న
మనుజుఁడేసుమ్ము సర్వస । మ్మానితుండు ॥కం॥ 72

ఏపాటఁబాడిన । నేమగు నీపాట
పాఠియైయుండిన । పండితుండు
ఏమాటయాడిన । నేమగు నీమాట
మతిఁదప్పకుండిన । మాంత్రికుండు
ఏబాటవీడిన । నేమగు నీబాటఁ
బాటించుచుండిన । బ్రాహ్మణుండు
ఏచోటఁవేడిన । నేమగు నీచోటు
వీక్షించుచుండిన । విద్వరుండు
ఎప్పుడేమేమిసేయుచు । నెట్టులున్న
నేమియగు నీవతానని । యెఱుఁగుబుధుఁడు ॥కం॥ 73

శోధించినను మహా । గూఢభావుండగు
తత్వజ్ఞుఁడేటికి । తప్పుఁడగును
సాధించినను సుధీబోధితాత్ముండగు
పండితుండేటికి । భ్రాంతుఁడగును
వేధించినను సద్వి । వేకయుక్తుండగు
మతిమంతుఁడేటికి । మమశుఁడగును
శోధించినను వేద । సూత్రవిజ్ఞుఁడగు
సానందుఁడేటికి । యజ్ఞుఁడగును
దన్నునిన్నొక్కరూపుగాఁ । దలఁచుబుధుఁడా
మన్నుమిన్నేకమైన నా । పన్నుఁడగునె ॥కంజ॥ 74

కలవుశాస్త్రములనే । కములు శబ్దగూఢ
ములు సాహితీశక్తి । కలుగవలయుఁ
గలరుపెద్దలుచెప్ప । గానసమర్థులు మాట
కారులకవాముండ । గావలయును
గలరుసాధులుసూపఁ । గలమనియంత్రు గన్
గొనినవాఙ్మనస । గోచరంబు
గలవన్నరూపంబు । గనరాదులేవంచు
వాఁగొన్నఁదానపో । లేకపోవు
నిన్నియునుజూడ నన్నియు । నున్నయయ్యె
నేనునీవయ్యెనీనాలె । యింతయయ్యె ॥కంజ॥ 75

ఊహించినీవని । యొకపరిదలంప
నఖిలంబునీవయై । నట్లుతోచు
వహాని నైయొకతేప । నేననిభావింప
నఖిలంబుమాయయై । నట్లుతోచు
విజ్ఞానదృష్టిచే । వీక్షింపనొకతరి
నఖిలంబు స్వప్నమై । నట్లుతోచు
మోహినైయొకసారి । దేహయాత్రదలంప
నఖిలంబుబంధమై । నట్లుతోచు
ఏమిసేయుదు నిందద । మిథ్యమేదొ
యెఱుగగాదివ్యదృష్టి నా । కీయవయ్య ॥కం॥ 76

శిఖియానవహ్నినా । జిచ్చనబావకం
బన్నను నగ్నియే । యయినయట్లు
రామగోవింద నా । రాయణ శివకృష్ణ
బ్రహ్మాదినామముల్ । బరగునీక
అజ్ఞులుగొందర । వార్థముల్ గల్పించి
శాస్త్రిచర్చలు గొన్ని । సలుపగలిగి
భేదంబునూచించి । వాదింతురిసత్యమే?
మతములేవి? దుష్ట । మతులుగాక
హరహరా! యాత్మవగునిన్ను । నరయలేని
వలవరింతలుగాకేది । పరమునీకు ॥కం॥ 77

షడ్గుణంబులఁజించి । షడ్గుణంబులఁ బెంచి
స్వానందినై యుండ । శక్యమగునె
సాధనంబులవీడి । సాధనంబులఁగూడి
హాయిఁజెందఁగ నెట్టు । లగును నాకు
నాల్గింటినిన్ గెల్చి । నాల్గింటిపైఁ బొల్చి
యేకమై యుండుట । యేలకలుగు
సర్వంబుగావని । సర్వంబునీవని
యెఱుకనై భాసిల్ల । నెంతవాఁడ
నేదియునఁ జేతఁగాదీవె । యేనటంచు
మొఱ్ఱిక్కడదను స్తోత్రములు సేతు । మోక్షమిమ్ము ॥కం॥ 78

పరమేశ్వరాయని । పాడెదనే కాని
మూఁగనై యేమేమొ । పొగులఁబోను
సర్వేశ్వరాయని । చదివెదనేకాని
వెఱ్ఱినై యేమేమొ । వెదుకఁబోను
శైవమాయని సదా । సేవింతునేకాని
జడుఁడనై యేమేమొ । సలుపఁబోను
దేవుఁడాయని దశల్ । దిలకింతునేకాని
శుంఠనై యేమేమొ । చూడఁబోను
ఏదినాతప్పు నాతెల । కింతకాదె
వృతుఱిడను దప్పులెంచక । ప్రోవుమయ్య ॥కం॥ 79

కదుఁజిక్కు-లోకులఁగాకులు వలికినఁ
    బలుకవీయుకదా ము | బలుకఁబోరు
చెప్పినవినదొక | చేటెఱుంగరు వ్వాల్ప
    మెఱుఁగుదురెంత మో | యెఱుఁగురీతి
వాదులాడుచునట్టు | వదలకగతిలేని
    యాడంబరము జూపి | యలముచుందు
బ్రహ్మభావనమందుఁ | బాదుకొల్పననాదు
    స్వాంతంబుచలియింప | నాగెనయ్య!
చాలునీమొండివాదుల | నక్కునంకఁ
బూర్ణమాగానభవమిచ్చి | ప్రోవుమయ్య ॥కం॥ 80

నిన్నెఱుంగనియట్టి | దున్నలెవ్వరునుగా
    రర్చించుదాసులే | యరుదుగాని
నీకథల్‌వినన్నట్టి | మూఁకలెవ్వరుగారు
    గమనించుపెద్దలే | కఱవుగాని
నీనామమనలేని | దీనులెవ్వరుగారు
    స్తుతియించుభక్తులే | సున్నగాని
నీమహత్తెఱుఁగని | నీచులెవ్వరుగారు
    గుర్తించుసాధులే | కొఱఁతగాని
దేవ! నీమర్మమేరికిఁ | దెలియరాదు
పుట్టివచ్చుట సహజమై | పోయెఁగాని ॥కంఠ॥ 81

ఇల్లలసాఁకి । యిది వెఱ్ఱియనువారుఁ
దీనఁడేమియని చుల్కఁ । గనెడివారు
ఈడనేయుండెనా । యెక్కడననువారు
రాతిపూజయటంచు । రగులువారుఁ
గవిచమత్కారంబు । గాకేమియనువారుఁ
గలరువారజ్ఞాన । కలితమతులు
సగుణనిర్గుణముల । సమభావమెఱుఁగరు
గాకనీగుడిలేని । గ్రామమేల
ఎఱుకపడ మాయఁకిలడని । యిట్లతోఁచు
నిఖిలజగదావనుండవు । నీవుగాదె ॥కం॥ ౪౨

ఏయూరనీమూర్తి । యెసఁగుచునుండునో
యాయూరఁబుట్టుటే । యధికఫలము
ఏయూరనీపూజ । లింపుమైజరుగునో
యాయూరనుంటయే । యమృతపదవి
ఏయూరనీకధ । లెప్పుడుజరుగునో
యాయూరబ్రతుకుటే । యధికసుఖము
ఏయూరనీయాత్ర । లేటేటజరుగునో
యాయూరనడుచుటే । యమితఘనము
అట్లుకాకున్ననదియూరె । యడవికాక
పరులుజంతువులింకేమి । తెరువుగలుగు ॥కం॥ ౪౩

ఎంతభాగ్యముసేసి । యీపుట్టువొందితో
యేనాఁటిపుణ్యమో । యిట్టులయ్యె
సామాన్యమేమూఢ । జనుఁడనై కేవల
పామరత్వంబునఁ । బడకనిన్ను
అధికమో యల్పమో । యర్చింపఁగల్గితి
గురుజనంబులఁగొంత । గొలువఁగంటి
ఇంకేమిగావలె । నేమనివర్ణింతు
నీవగాయిదియెల్ల । నిర్వహించి
గాచితివి తుట్టతుదకేల । కాచవావు
కాచవఁచనైన నీకవ । కీర్తి కాదె ॥కంద॥ 84

గుణములన్నియుఁగల్గి । గుణివికావెట్టుల
గుణయుక్తుఁడనునేను । గొలువఁగలను
గుణములుజడములు । గుణివైనయెఱుకీవు
జగమెల్లనెఱుకయై । సత్యమయ్యె
బంధమోక్షములంచు । భ్రమఁగొన్న దెఱుకయే
యెఱుకయేసాక్షియై । యెసఁగుచుండు
ఎఱుకయేయీదేహ । మిదికల్గునంతకు
గుణములెందుకుపోవు । గుణినికాను
భేరయీచిత్రమేరికి । బయలువడదు
తెలుపుమచ్చంపుటెఱుకనై । వెలయుసరణి ॥కంద॥ 85

ఎఱుకయంచువచించు । టెఱుఁగుచున్నయే
    యెఱుకంచువెఱ్ఱులై । యేలపలుక
ఒకఁడున్ననెన్నేని । యున్నట్లుతోఁచును
    సున్నైనజగమెట్లు । చూడనగును
ఎఱుకయుండినఁగాక । యింతయుభాసిల్లె
    నెఱుకయేలేకున్న । నేమిలేదు
నాస్తికమైపోవు । నగుబాటునకువచ్చు
    నాత్మసత్యమునకు । హానికల్గు
దేవ! యింతకునీమాయ । తెలియనీదు
శాకరా యెఱుకన్ననీవన్న । గాదెయొకటి ॥కంజ॥ 86

అసలెపుట్టుటలేని । దాకసంబద్ధాన
    సంభవించెనుభూత । సంచయంబు
జడములన్నియొకట । సంధానమైలేవా
    మయ్యెఫేనభవన । మనఁగనందు
దేవుండవౌనీవు । జీవుండవైచొచ్చి
    పలువిధంబులఁదోఁచి । భ్రమలుగొలిపి
చేసినావెన్నియో । చిత్రంబులీవాక్యఁ
    డై యుండ సున్నలై । యన్నియుండు
అన్నియునునాత్మవగు నిన్ను । నాశ్రయించి
భావమానంబులైకను । పట్టుచుండు ॥కంజ॥ 87

దేహంబుసుఖమున । కీహాకల్గిననిన్ను
వ అచినట్లగునిన్ను । మఱువకున్న
దేహవృత్తులులేవు । దేహంబుగణియింప
జడమయ్యెనాకేమి । సత్యమున్న
దేహంబునాదయ్యె । మోహంబువోదయ్యె
ప్రారబ్ధముడుగని । బాధయయ్యె
జీవుఁడయినవేళ । లేవేలజంటలు
దేవుఁడయిననేల । దేహమ్ముకు
ఇంతయునుజిత్రమెఱుఁగను । నింపుమీరు
దేహయాత్రియుఁదుదను ని । రీహనిమ్ము ॥కం॥ 88

అధికుండనేను నీ । వల్పుండవెట్లగు
నైక్యమెందులకిట్టి । యాశయనకు
నీవాక్యములునూడ । నీవేనునొకఁడగాఁ
గన్పట్టెగురువుల । కృపరణిఁదెల్పి
రనుభవంబునఁజూడ । నదియెనిశ్చితమయ్యె
నరయఁజిత్రమె భేద । కరణమయ్యె
నీకునాకుమధ్య । నెలవయ్యెనీమాయ
యీవెసూవె సర్వ । మేది జగము
స్వప్నదృశ్యము దీనిని । సత్యమనుచు
నమ్మిచెడిపోతి నాకునై । క్యమ్మునిమ్ము ॥కం॥ 89

ఇల్లుపెండ్లామును । గల్లయైకనుపట్టె
వాల్లక్కరైయెతోఁచె । నూరుపేరు
ఇచ్చకమనితోఁచె । నిష్టబంధుపేరిమ
వెట్టియైకనుపట్టె । విద్యయెల్ల
పరమమోక్షాపేక్ష । బంధంబుగాఁదోఁచె
గాథలైకన్పట్టెఁ । గర్మలన్ని
త్రిగుణజంజాటమై । దృశ్యమెల్లనుదోఁచె
మిథ్యయైకనుపట్టె । మృతియుజనియు
అవ్యయుండవునీవె స । ర్వాత్మవగుచు
నన్నిఁటనుబూర్ణముగనున్న । యట్లుతోఁచె ॥కం॥ 90

ఏనామమనుకొన్న । నీనామమేయగు
నేరూపుఁజూచిన । నీవెయగుదు
ఏవెలుంగునుగన్న । నీవెలుంగేయగు
నేభావచూడిన । నీవెయగుదు
ఏచింతలోనున్న । నీచింతయేయగు
నేవేల్పుఁగొల్చిన । నీవెయగుదు
ఏవాక్యమునువిన్న । నీవాక్యమేయగు
నేమిబోధించిన । నీవెయగుదు
ఇట్లుతెలియనివారికే । నీవులేవు
గాకప్రత్యక్షమూర్తివి । కావెదేవ! ॥కం॥ 91

వరుసకుసంకల్ప । పరతతర్కముగనొండు
పనిలేదుసంకల్ప । వరుఁడవీవు
జతనమెక్కుడ శుద్ధ । సత్వావలంబనఁ
దిరుగుటకంటె నే । మెఱుఁగఁగలదు
విమ్మట నీవెకా । ప్రియముమైచేకొని
ప్రత్యక్షమైనిజ । పథముఁజూపి
కాపాడకుండినఁ । గల్పాంతముండియుఁ
జావుపుట్టువులేని । శాంతిఁగనున
పేటిమాటలవెన్నని । తెలుఁగవచ్చుఁ
గానియెవ్వఁడునిన్ జూడఁ । గలఁడు దేవ! ॥కం॥ 92

నక్కనుస ర్గంబు । నాఁడోఁచెనంటివా
భ్రమరకీటన్యాయ । పథముగలదు
ఏనేడఁజూచుట । యెక్కడనంటివా
సంవాదినామస । సరణకలదు
నామాయఁగననగు । నాయంచునంటివా
సదసత్తులను దెల్పు । చదువుగలదు
అల్పజ్ఞుఁడవు తెల్వి । యఃబ్బునేయంటివా
గురుశిష్యవాత్సల్య । గరిమకలదు
ఎట్లుతప్పించుకొనఁజూడ । నెసఁగఁబోదు
జాలమెందుకుపోవక । వీలుగాదు ॥కం॥ 93

ఎంతవాఁడవొ నిన్ను । నెఱుఁగంగ నెవఁడోపు
ద్వైతంబునీయెడ । నేతియగును
నిశ్చింతనీవైతి । నేనైతివ్యాప్తి
నేననియెన్నాళ్లు । కానఁదివిరి
కాంచఁగశక్యమే । కలవారనిజపరాన
పరిపూర్ణమననితః । పరముగలదె
వాక్కులుశబ్దముల్ । వాగతీతుఁడవీవు
జీవుఁడవీవు సా । క్షియునునీవు
నీవునేననువాఁడవు । నీవునేను
నీవునీవైనప్రభుఁడవు । నీవునీవు ॥కంజ॥ 94

వేదాంతిననిచెప్పు । వెఱ్ఱిమాటలెకాని
యెక్కడోవేదాంత । మెంతమాట
దేవుఁడాయని సదా । దేవురించుటెకాని
కాంచునే త్వమ్మెఱుఁ । గనియెడలను
ముక్తియంచువచించు । యుక్తిమాత్రమెకాని
సమకూఁగునే సర్వ । సమతలేక
బ్రహ్మమంచువచించు । పైబడాయియెకాని
యద్వయపూర్ణంబు । నరయుటెట్లు
ఇంతయునువెఱ్ఱితెలియక । యిట్టులవుట
కకనీకంటెవేరేను । గలనెదేవ! ॥కంజ॥ 95

భావింపనా కేది । పాపంబునీమాయ
భ్రాంతిత్వమిడెఁగాని । బ్రహ్మరూప!
గణియింపనా కేది । కామ్యంబునీమాయ
యల్పత్వమిడెఁగాని । యమలచరిత!
కనుఁగొన్న నా కేది । జననంబునీమాయ
కర్మత్వమిడెఁగాని । నిర్మలాత్మ!
చింతింపనా కేది । చింత్యంబునీమాయ
యజ్ఞత్వమిడెఁగాని । యప్రమేయ!
ఈ విన్నపంబుఁ దెలియుమి । యింత చేసెఁ
గాని తెలిసిన నింకేమిఁ గలదు చేయ ॥కంజ॥ 96

రవ్వంత లేనిదీ । రాజ్యంబు నేటికో
తగిలించి యెచ్చటో । దాగినావు
కొలలేని యీవట్టి । కోర్కులు నేటికో
కలిగించి యెచ్చటో । నిలిచినావు
చవిలేని యీవృథా । సంసృతి నేటికో
దుమికించి యెచ్చటో । దూరినావు
కడు హేయమైన । యీకాయంబు నేటికో
ప్రకటించి యెచ్చటో । పట్టినావు
దేవ! యీపాటినిన్నియుఁ । దీర్చి దయను
గూర్చి పరితృప్తుమైవిమ । యార్చులార్చ ॥కంజ॥ 97

గొడవలెన్నియొనుండు । (గోవింద) యన్యెడు
దిగులేలనాకు నీ । దృష్టియుండఁ
చింతలెన్నియొనుండు । (శ్రీరామ) యన్యెడు
నరపేలనాకు నీ । యండయుండ
ఆశలెన్నియొనుండు । (హరహర) యన్యెడుఁ
గొఱయేలనాకు నీ । కూర్మియుండఁ
జేఁతలెన్నియొనుండు । (శివశివ) యన్యెడు
వగపేలనాకు నీ । భక్తియుండ
ఎన్నియైనన్నైన । నెప్పుడైన
వెరువవెరువను నీభక్తి । విడువవిడువ ॥కం॥ 98

భద్రుఁడై యెవ్వఁడు । భవదీయభక్తుఁడో
వానికివేవేయి । వందనములు
స్నేహియైయెవ్వఁడు । జీవదయాళువో
యాతనికివెమ్రొక్క । లమితశతము
శాంతుఁడై యెవ్వఁడు । జగదుపకారియో
యాతనీకివె జోహా । ర్లర్బుదములు
వేదియైయెవ్వఁడు । వేదానుకూలుఁడో
వానికినివే య । పారనుతులు
బోధియై (తత్వమసి) విన్న । పూర్ణుఁడెవఁడో
యట్టివానికనంతంబు । లర్చలిదిగొ ॥కం॥ 99

కలవుగలవునీవె । కలవంచుఁబలికెద
　　శేషమైయుండఁగఁ । జేయుమయ్య!
నీవునీవఖిల । మీవంచుమ్రొక్కెద
　　నమృతమైయుండఁగ । నరయుమయ్య!
దమనదమనదుఃఖ । దమనయంచర్చింతు
　　నేకమైయుండఁగ । నేలుమయ్య!
శాంతిశాంతి పరమ । శాంతియంచెఱుఁగెదఁ
　　బూర్ణమైయుండఁగఁ । బ్రోవుమయ్య!
నిజమునిజమంచు నిజమంచు । భజనసేతు
జయముజయమంచుజయమంచు।సాఁకుమయ్య ॥కం॥ 100

విజయంబునీకు శ్రీ । విశ్వేశ! జగముల
　　నెలమూఁడువానలు । గలుగుఁగాత
శ్రేయంబునీకు హృ । షీకేశ! ప్రజలెల్ల
　　పుణ్యప్రవర్తులై । పొలుచుఁగాత
కుశలంబునీకు, వై । కుంఠేశ! క్షితితలం
　　బతిసస్యవృద్ధిమై । యలరుఁగాత
భద్రంబునీకు భ । వానీశ! సర్వమున్
　　శ్రీమంతమైసదా । చెలఁగుఁగాత
మంగళమునీకు గురువులం । భక్తవరుల
వినయులై శిష్యులెపుడు సే । వింతురేగాత ॥కం॥ 101

ఓమ్ తత్ సత్.

